శ్రీ బాలాత్రిపురసుందర్యై నమః.

# తొలిపలుకు

ఇది యొక అభిత్తి చిత్రకల్పం. దీని కొక యితివృత్తము లేదు, ఊహాగానము తప్ప.

విభావసామగ్రిలో కాలచక్రమున ఘటిల్లుచున్న కఱవులు, కాటకములే ఆలంబనము. ఆకటిచావులు, అల్లాడిపోయిన యార్తజీవుల కంకాళదృశ్యములే ఉద్దీపనములు.

1941 వ సంవత్సరపు టుత్తరార్ధమున ఆంధ్రదేశములోఁ గొన్నిప్రాంతములను ముంచియెత్తిన వీరక్షామపరిస్థితులును, 1943 లో పత్రికాముఖమున వినవచ్చిన బెంగాల్ రాష్ట్రములోని యాఁకటిచావువార్తలును, ప్రకటించిన ఆ బక్కజీవుల మృతకళేబరదృశ్యములును దోహదములు.

కాఁగా గ్రంథరచనకు కాలము కలిసిరాక కావలయు, కడుపులోనే గఱుకుగట్టిపోయిన కరుణరసము — 1946 వ సంవత్సరములో దైవమాతృకము లైన కొన్ని యాంధ్రప్రాంతములలోఁ దొలకరులు బిగించి కాలము కటుకువాఱుటతో ఆ సంవత్సరాంతమునకుఁ జెలరేఁగిన క్షామఘోషయు, ఆవేదనయు దుర్భరములై గర్భనిర్భేదకములు కాఁగా సంక్షుబ్ధహృదయమును జీల్చుకొని వెలువాఱినదే యీ యమృతసందేశము.

'దుఃఖితే మనసి సర్వ మసహ్య' మ్మన్నట్టుగా ఇంతటి దుస్థితికిఁ గారణ మేమా? యని యన్వేషించుటలోఁ గాన్పించిన వస్తుతత్త్వమే చివరకుఁ గథావస్తు వైనది.

గురోర ప్యవలిప్తస్య కార్యాకార్య మజానతః,
ఉత్పథం ప్రతిపన్నస్య కార్యం భవతి శాసనమ్!

ఈ ప్రకరణమున నడిచిన యూహాగాన మింతటితోనే పరిసమాప్త మనుకొనరాదు. దెబ్బ తగిలినపు డెల్ల భావుకుని రెచ్చగొట్టు భావపరంపరలు కలమునఁ బడవు. కలి వంత వానకే!

గుణదోషప్రకరణములో దోషప్రవణత యెవ్వరికిని అభిప్రేతము గాదు గదా!

గుణో యది స్యా చ్ఛిరసా స ధార్యః
దోషో భవే చ్చే త్పరిహార్య ఏవ,
గుణాగ్రహా ద్దోషవిసర్జనాచ్చ,
తతో న మేఽన్యా గుణదోషచింతా.

ఇంతకును గావలసినది

స్వస్తి ప్రజాభ్యః; పరిపాలయంతాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః.

కలము, కాగితము, కవిత — వీనికిఁ గఱవు లేకుండఁ జేసిన సృష్టికర్త ముద్రణవిషయములోఁ గూడఁ జిన్నచూపు చూడకుండినచో కవిలోకమిూ పోకడతో నుండెడిది గాదు.

ప్రాయేణ సామగ్ర్యవిధౌ గుణానాం
పరాఙ్ముఖీ విశ్వసృజః ప్రవృత్తిః!

కనుకనే కాలము పెట్టిన భిక్షను కాచుకొని యుండఁగా 7 ఏండ్లు గడచినవి.

ఏది వచ్చినను ఒకమంచికే యనుకొనుపక్షమున ఈ మధ్యకాలములో కాలపురుషుఁడు కల్పించిన కొన్ని సంఘటన లిందుఁ జేరఁగలిగినవి.

సహృదయహృదయాహ్లాదిత్వమే సంపాద్యముగాఁ బ్రవర్తిల్లిన సారస్వతరంగమునం దేమాత్రమేని యది సంపాదితమైననాఁడు సారస్వతోపాసకుని తపస్సు సఫలమైనట్లే. అందులకు సహృదయులే ప్రమాణము.

"అయం మే వాగ్గుంభో విశదపదవైదగ్ధ్యమధుర
స్స్ఫురద్బంధో వంధ్యో జడహృది, కృతార్థః కవిహృది"
(అని యొక కవిసూక్తి.)

యదక్షర పదభ్రష్టం మాత్రాహీనం చ యద్భవేత్,
తత్సర్వం క్షమ్యతాం దేవ! నారాయణ! నమోఽస్తు తే.

కవితాసామ్రాజ్యము
నంద్యాల
2-12-1954

మ. వేం. సు. శాస్త్రి

# విషయసూచిక

అర్వాచీనము, అపర్యాప్తము నగు నాంధ్రవ్యాకరణము ప్రాచీన కవుల లోను అదృష్టము చాలనివారి నధిక్షరించుచున్న దనుట అనుభవజ్ఞుల కెఱుక గానిది గాదు. వ్యక్తినిబట్టి బ్రహ్మ తిమ్మ, తిమ్మ బ్రహ్మ యగుటయు నసంభవము గాదు.

ధన్యాని స్థలవైభవేన కతిచి ద్వస్తూని; కస్తూరికాం
నేపాలక్షితిపాలఫాలపతితే పంకే న శంకేత కః?

౧. ఎక్కడో యనునది ఎక్కడనో యనియే యుండవలెనని కొందఱు. కాని ఎక్కడో యనుటయుఁ దప్పు గాదు.

సీ. అడియరితనమున నప్పాండవుల నాశ్ర
యింపంగఁజాల నే నెక్కడేని

భారత సౌప్తిక ప్ర ఆ. 7.

౨. అందుచే, అందుకొఱకు, అందువలన, అందున – ఇత్యాదులు శిష్ట పరిగృహీతములు గావని కొందఱు. కాని

ఆ. రోషమయమహాతరువు సుయోధనుఁ డురు
స్కంధ మందులోనఁ గర్ణుఁ డలరు. భార. ఉ. ప్ర. ఆ. 35

3. మబ్బుల్ దొరా, గబ్బిలాల్గుడుల ఇత్యాదులకు ప్రౌఢ వ్యా. సంధి ౧౭ వ సూత్రము.

౪. ప్రతి యనునది – సంస్కృతములో వీప్సార్థమున వచ్చెడి ప్రతి గాక తెలుఁగులోను అపదూఱు, అపనమ్మిక, అపసెవము, అపపాడి ప్రభృతులలోని అప వంటిది.

౫. చూపించినావైతివి ఇత్యాదులలో అగుధాతు వనుప్రయుక్త మగుట బాలవ్యా. క్రియా. 114 వ సూత్రమునకు విరుద్ధము కాదా? వ్యతిరేకార్థము కాదు గనుక అను ప్రశ్నకు సూత్రసమన్వయము క్రియాపదములకే యనునది సమాధానము.

౬. బాధ్యత — అనుపదము సంస్కృతభాషలోనికే చేర్పఁదగినది కాదని కొందఱు. విధిప్రాప్తమై, అవశ్యానుష్ఠేయమైన ధర్మమును నిర్వహింప

నప్పుడు భాషింపఁబడెడువాఁడగుట యను నర్థమును బోధించెడి యీ పదము వంటి పదము సంస్కృతాంధ్రములలో మఱియొకటి లే దనియూ, రూపసిద్ధికి శాస్త్రానిర్ధారము ___, 'సాక్షే ర్యోగ మపహరతి' అను న్యాయముచే 'ముఖ్యార్థ బాధే తద్యోగే రూఢితోఽథ ప్రయోజనా' త్తని యంగీకరించిన లక్షణా వృత్తియు ___ గల్గినప్పుడు నిషేధ మెట్లని మఱికొందఱు. ఆదిపర్వము మొదలు ఆధునిక కృతులవఱకు ప్రీతితో అను నర్థమునఁ బ్రయోగింపఁబడుచున్న 'అర్థిన్' అను పదము సంస్కృతమా? తెలుఁగా? ఏ భాషాపదమైనప్పు డీయర్థము రా వీలున్న? దని కొందఱు వేయు ప్రతిబంధి ప్రశ్న. బాధ్యత యున్నది వ్యస్త పదముగానే గాని సమస్తపదముగా నుండరా దని యొక వర్గమువారి సమ్మతి. శబ్దశక్తి సమస్తమునుగూడ సమ్మతింపఁజేసికొనఁగల దని ప్రగతివాదులు.

౭. కించిత్, ఈషత్, సాక్షాత్, హఠాత్ ప్రభృతులగు నవ్యయములు తెలుఁగులోఁ బ్రత్యేక ప్రయోజ్యములు గా వని కొందఱు. ఇవి నదాది ప్రతిపదోక్తావ్యయ గణములోఁ జేరిన వని మఱికొందఱు. ఇందులకుఁ బ్రామాణికుల ప్రయోగము లే కొన్ని.

చిన్నయసూరి నీతిచంద్రిక మిత్రభేదములో 'ఈషత్తయిన దోషంబు చేసి యెఱుంగ' నని సంజీవక వాక్యము.

అల్లసాని పెద్దన మనుచరిత్రలో చ. ఆ. 115 'నిలింపాంగనాతి నని వితీర్ణించి కించిత్తును గొంచక' అని.

౮. దీనుఁడై యాచించు అను నర్థములో 'దేవిరించు' అను పదము విస్తారముగా వినఁబడును. దేవురించు అనునది దైన్యము నొందు అనియే శ. ర. లో నున్నది.

శబ్దరత్నాకరములోఁ జేరని పదార్థము లెన్నియో యున్నవి. చేరిన వానిలో మార్పుఁ జెందవలసినవియు నున్నవి.



శ్రీ మేధాదక్షిణామూర్తయే నమః.

శ్లో. అజ్ఞానతిమిరాంధస్య జ్ఞానాంజనశలాకయా,
చక్షు రున్మీలితం యేన తస్మై శ్రీగురవే నమః.

శ్లో. కిం కవే స్తేన కావ్యేన? కిం కాండేన ధనుష్మతః?
పరస్య హృదయే లగ్నం న ఘూర్ణయతి యచ్ఛిరః.

తే. నేను నాయంతవాఁడను; ♦ నేను గలుగ
జగతి కెంత గావలె నంతె ♦ జరుగఁ గలదు;
నాకుఁ దగినంత ప్రజ్ఞయే ♦ నాకుఁ గలదు;
అతిశయోక్తులతో నేల? ♦ యార్యులార!.

ఉ. ప్రాసముకోసమై వెదక♦రాదు; యతిప్రతిపాదనార్థమై
గాసిని జెందరాదు; గణ♦కల్పనకోసము జల్లిపల్కుల
భ్యాసము సేయరాదు; తగి♦నంతటిసొంపుగ నొక్కపద్యమేఁ
వ్రాసినఁ జాలదే? కవిశే♦రంబుల నుయ్యాల లూఁప నేపునన్.

ఉ. పామరుఁ డుల్లసిల్లవలె ♦
బాలుఁడు కేళిని దేలఁగావలెన్
గోమలి మోహ మందవలెఁ ♦
గోవిదుఁడున్ దల యూఁపఁగావలెన్
స్వామియుఁ బ్రీతిఁ జెందవలెఁ ♦
జక్కని శైలిని బద్య మల్లుచో
నేమిటికో మఱెవ్వరికి ♦
నిం పొసఁగూర్పని పద్యజాలముల్.

ఉ. వ్రాసిన పద్య మెల్లను సె♦బా సనిపించుకొనంగఁ బోలు! నం
దేసరసత్వమేని, సొగ♦సేనియు — భావములోనో, శబ్దవి
న్యాసములోనో, యౌచితినో,♦వ్యంగ్యమునందునో, యర్థచిత్రమం
దో సరిపోయియుండవల♦యుక్ రసికుల్ తల లూఁచి మెచ్చఁగన్.

శా. ఉన్నా మింతటిదాఁక నోర్చుకొని; యేదో చెప్పికొన్నంతలో
విన్నారా సరి; కానిపక్షమున నావేశంబు లెట్లుండునో!
యెన్నాళ్లీ దురవస్థ లాదుకొన లేరే? స్వామి!; లిట్లున్ననాఁ
డెన్నో మార్గము; లేదా హాయియగు స్థాయిన్ జూచుకోనుందువే

క. మన కష్ట నిష్ఠురంబుల,
మన సంకటములను, మానమర్యాదలనున్
వినిపించుకొంద, మావలఁ
గనిపించును వారివారి ఘనగౌరవముల్!

మ. 'ఇది యి' ట్లన్నను నొప్పు తప్పరయువారే లేరుగా; కిద్దియున్
గదళీకంటకవృత్తి యగా నెఱిఁగియున్ గష్టంబుగాఁ దోఁచుటన్
మదిలో నున్నదె మాటలో వెలసె; స్వామ్యం బుంచుకొన్నట్టి బ
ల్లిదు లధ్యానముపాలు గానియెడ నుల్లేఖింప నే ముండెడున్? 7

మ. మనుధర్మప్రతిపత్తితో నెవరిధర్మంబందు వారున్న — నిం
క ననావృష్ట్యతివృష్టి వహ్నిభయ భూకంప ప్రవాతప్రకో
పన మారీముఖరోగ చోర కుజ నోత్పాతావినీతిప్రవ
ర్తనసంక్షోభము లున్నె? యివ్వి గలుగన్ బ్రారబ్ధ మేమయ్యెడిన్?

మ. అరయన్ దూష్య మదండ్యదండనము, దండ్యాదండనంబున్ మఱిన్
నరకప్రాపక; మాటచేత నివి క్షంతవ్యమ్ములున్ గావు; సం
స్కరణీయంబులె యౌ; నరాజక తిరస్కార ప్రమాదాది దు
ర్భరదౌర్భాగ్య ముపేక్షసేయుటయు ధర్మద్రోహమేయయ్యెడున్.

తే. ఏమి కఱవు వచ్చె ♦ యీ మహోదధిలోన
నేడుపాళ్లు గురియ ♦ నేఁగదయ్య ?
రాణ మీఱి నతఁడు ♦ రత్నాకరుండైన
నీమొగాన కుప్పు♦నీళ్లె గాదె ?

చ. కనఁబడి యాశఁ జూపి, ఘన♦కార్యముఁ జేసెడి వాలకంబుతో
డను వినువీథిలో నలుగ♦డల్ పచరించుచు, నంతలోననే
కనుమఱుఁ గాదు; వి ట్లగుటఁ♦గాదె చిటుక్కునఁ జిన్కు లేకపో
వునది ? జగంబులో ఘనుల♦పోకడలే యిటులైన నే మగున్ ?

ఉ. ఉండినమాట యన్న జగ♦మోర్వదు గాని పయోధరంబ ! నిన్
గొండలతోడి నేస్తమున♦కున్ జత గూర్పఁగ నిక్కు, నీల్గి, యు
ద్దండత వానిబల్మి గొని ♦ తళ్కునఁ గుల్కుచు లోకతాప మె
ట్లుండిన ముంచి వేయు దట; ♦ యుక్త మెఱుంగుదురే జడాత్మకుల్

చ. అనఁదగ, దైన నందు; సమ♦యంబున కక్కఱ దీర్తు వంచు నె
న్నినకొలఁదిన్ బయోధరమ ! ♦ నిక్కెదు, నీల్గెదు, విఱ్ఱవీఁగె; దే
మనుకొనినావొ ? నీ విధి; య♦నంతరమా పతనంబుఁ జూడ; వా
మినమిన లేమి? యామునుఁగు♦మేలము లేమి? హితంబెఱుంగుమా

చ. సరసుఁడ వందు, రేటిసర♦సత్వమొ ! 'వర్షము స్వామి!' యన్నచో
మరిమెద; 'వెట్లు స్వామి?' యన ♦ యోగము లేదని సాకు వెట్టు; దె
వ్వరికిని బక్షపాత మది ♦ వద్దుగదా! యటులైన నెక్కడో
కురిసెద వెట్లు? యోగములు♦గూడియె యక్కడఁ గ్రుమ్మరించెదో !

సీ. నీ యొనర్చెడి కార్య♦నిర్మాణమును జూడ
గంధర్వనగరముల్ ♦ గట్టుచుండు
నీ విహరించు క్రీ♦డావినోదముఁ జూడ
గాలిమేడలఁ దిరు♦గాడుచుండు
నీ చేయుపనుల యం♦దిక పొందికలు చూడ
నేల విడిచి సాము ♦ నెఱపుచుండు
నీ పన్నుగడల యా♦హాపోహలను జూడఁ
జపలాత్ముఁ డనుటను ♦ జాటుచుండు
తే. ఎందులోఁ బట్టి చూచిన ♦ నిట్టు లున్న;
దింక ముడి వడ్డ దెచటనో ♦ యెఱుఁగరాదు;
మిన్ను ముట్టిన కీరితి ♦ మెఱపు మెఱసె
నబ్బ! యేమందు నీజాడ? ♦ బ్రమ్మజేఁడ!

మ. ఘనుఁడా! కాలము మాఱిపోయినది; లె♦క్కంబెట్టుకాలంబు గా
దని గుర్తింపుము; యిచ్చ వచ్చినటు సే♦యన్ బూర్వకాలంబు గా
దనుకో; నాయకు లేకమైనయెడ నే♦మై పోవుదో! కాన నీ
వనుకూలంబుగ నీపనుల్ జరుపుకో♦వయ్యా ప్రశాంతంబుగన్. 25

ఉ. ఎక్కడ నెంత గావలెనో ♦ యించుక లెక్కలఁ బాఱఁజూడు; మా
లెక్కప్రకారమే దొసఁగు ♦ లేక చరింపుము; పక్షపాతముల్
ప్రక్కకుఁ జేరనీకు; గుణా♦పాతముగాఁ జరియించుచుండినన్
దక్కిన పుణ్యపాపములు ♦ దైవముపైఁ గల; వింత యేటికిన్? 26

ఉ. ఏ మనుకొంటివో జలద! ♦ యిచ్చకు వచ్చినయట్లు చేసి కన్
బ్రామఁ దలంచితేమొ? యది ♦ పాఱదు; శాఠ్యత యన్నఁ గత్తిపై
సాము సుమీ! సమీహితము ♦ చక్కఁగఁ దీర్పవలెన్; నియుక్తిలో
గోములు గీములున్ దగవు; ♦ గ్రుడ్డిప్రభుత్వము గూడ దేమియున్.

మ. గమనింపం దగు; నీదురాక యెపుడో ♦ గానుండ ముందే ప్రజ
ల్సుముహూర్తంబని గౌరవార్థమయి ఱా ♦ ళ్లున్, రప్పలున్, గడ్డిగా
దము లేరించియు, నిండ్లు వాకిళులు క్రొ ♦ త్తల్ లేపియున్ గాచియు
న్న, మనస్ఫూర్తిగ నాదరించినది యే ♦ నాఁడయ్య? నీ వభ్రగా!

సీ. నిల్కడగా నిల్చి ♦ నిముసమేన్ గురియవే!
నీయబ్బసొమ్మేమి ♦ పోయెనయ్య?
ఆరీతిఁ గురిసిన ♦ నంతటఁ గురియవే!
నీతాతగం టేమి ♦ నీల్గెనయ్య?
అంతటఁ గురిసిన ♦ నదను దప్పింతువే!
నీవారిసొత్తేమి ♦ నిలిచెనయ్య?
అదను దప్పించిన ♦ నావలఁ గనరావె!
నీ ముల్లెముడు పేమి ♦ నీఁగెనయ్య?

తే. కానవచ్చిన యట్టులే ♦ కానవత్తు
కురియవచ్చిన యట్టులే ♦ యుఱిమి మెఱతు
చిట్టచిను కుండఁబోవ దిక్కట్టులందు
ఏమి చిత్రవిచిత్రాల ♦ స్వామివయ్య?

తే. ఇటుల నెన్నని లేవు? పు♦క్కిటను బెల్ల
మంగిటఁ విష మను మాట ♦ యర్థ మయ్యె
ఘనులు ఘను లన్న ఘనత యొ♦క్కటియె గాక
యేమి సరసత్వ మున్నదో ♦ యెఱుఁగరాదు.

క. ఎక్కడికి ధర్మ మయ్యా?
అక్కఱపడినపుడు చేయ ♦ నగునది యేమీ?
కక్కుఱితి దీర్చుకొనుటా?
చక్కఁగ యోచించి చూడు! ♦ సరసుఁడవు గదా!

క. గగనచరత్వముతోడనె
మిగిలిన సంగతులు గూడ ♦ మే లగున? ఘనా!
ఒగి నీ వరిగినయెడ నె
మ్మగనే యుండినను, పొటుకు ♦ పుట్టక యున్నే?

ఆ. జీవహింస యెవరు ♦ చేయరా దంద్రుఁగా!
నీకు లేద? యిట్టి ♦ నియమ మబ్బ!
పైరు పచ్చలందుఁ ♦ బ్రాణంబు లేద?
వ్వాని నెట్లు చంపఁ ♦ బూనెదయ్య?

ఆ. నిజము పల్కనంత ♦ నిష్ఠురంబేగద.?
యైన మానెఁ; జెపుము; ♦ అబ్బ! కొన్ని
తావులందె కురియు♦దే వారు నీకబ్బ
వెనుకవార? యమ్మ ♦ వెనుకవార?

ఏ. జలదానంబునఁ బక్షపాతముననో ♦ సౌకర్యముల్ జూచి య
ప్పుల నీకుండుటచేతనో తుది ఫలం♦బుల్ ముంచి కూర్చుంటనో
జడమైపోయిన దాత్మ నీకు; నిఁకఁ ద♦వ్యాప్త్యర్థమై చక్కఁగా
జలదానమ్ము నొనర్చుకొమ్ము ఘనుఁడా! ♦ శాంతించు దుర్దోషముల్.

మ. ఒకవేళన్ గ్రహచారయోగ మది యే♦దో బాగుగా నుండి యిం
తకు నీకించుక బుద్ధి పుట్టినను దా♦నన్ సంతసం బేమి? మా
నక యెండే నొకచో జలప్రళయముల్ ♦ గావింతువేగా! వలా
హక! యిల్లల్కినమాత్రఁ బండుగగునే? ♦ యల్లాట లేకుండునే?

శా. ఎన్నన్ బ్రేమమయం జగత్తనుచు గా♦నీ, యల్లుఁడే వచ్చినన్
మూన్నాళ్లేగద ముద్దుముచ్చటలు? సం♦భోదా! యిట్లై యుంటచే
త న్నీవైనను వచ్చిపోవునెడ రో♦తల్ పుట్టకుండంగ బల్
విన్నాణంబుగ నిల్వ మాచితిమెయిన్ ♦ విశ్వంబు బ్రేమింపఁగన్.

శా. ధర్మాధర్మము లేమి చూడక ప్రభు♦త్వం బెట్లు సాగించినన్
మార్మాటాడక నోరు మూసికొని యి♦న్నాళ్లుండె లోకం; బిఁకన్
నిర్మర్యాదముగాఁ జరించినయెడ ♦ న్విశ్వాసరాహిత్యపుం
దీర్మానం బొనరింతు రబ్ద! యటుపై ♦ త్రిప్పల్ విచారించుకో. 46

ఉ. అంబుధరా! ధరాతలము♦నందలి వారి వినిర్మల స్వభా
వంబును జూడు! నీకు దయ ♦ వచ్చిన రాక తొలంగినన్ వ్యథా
లంబన ముజ్జగింపక, త♦లంగక, నీవ పరాయణం బటం
చుం బెనునాస నుండ సర♦సుండవుగా! ఘన సుంద నేర్చితో! 47

చ. వరగుణులైన పెద్దలు స♦భాస్థలమందునఁ జేరి నిన్నుదా
హరణము పెట్టుకొందురుగ♦దా! జలదా! 'వరి కొక్క-వాన, ఊ
దర కొకవానయా?' యనుచు ♦ ధర్మము సెప్పెడుపట్లు; నిట్టి నీ
చరితము పక్షపాతపుఁ బ్ర♦సంగములన్ జెడనాడఁ జెల్లునే? 48

చ. అణఁకువ తప్పి, తప్పిదము ♦ లాఁచక సేయు మనుష్యజాతి కా
రణముగ —, నైజధర్మము ని♦రాకృతి సేయక, పాయకున్న యా
తృణ కృమి కీట పక్షి పశు ♦ వృక్ష లతాదుల నేఁచె దేల? పెం
పణఁగగఁ; నిన్ముతోఁ గలియు ♦ నగ్గికి సమ్మెటపోట? వారిదా! 49

చ. పుడిసెడునీళ్లు వోయని ప్ర♦బుద్ధుల కేనియుఁ గోర్కె దీర్చు, నె
క్కుడు దుడుకుందనానఁ జెడఁ♦గొట్టినఁ, దిట్టినఁ, గూలఁద్రోసినన్
జెడవడి తత్ప్రతిక్రియల♦ పేరిట నేమియుఁ జేయ; విట్టు టుం
డెడి తరుజాతి నేఁచ నగు♦నే? తగునే? మొగిళుల్ నెఱాదొరా!

చ. అడుగవు చేయి సాచి కడ ♦ కష్టాలజీవిత మైన, నెత్తిపై
నిడుకొని పోవునంతవఱ ♦ కెక్కడ కేనియుఁ బోవు, ద్రోవలే
నడుగులు వట్టుచోఁ శ్రమము ♦ లార్చును, హాయిని గూర్చు; నిట్టి ల
య్యెడు తరుజాతిపై సలుప ♦ మెంచెద! వేమి వివేక? మంబుదా!

తే. పాఁడి పంటలపై నిల్చెఁ ♦ బ్రాణిబ్రతుకు!
వానియుత్పత్తి నీచేతఁ ♦ బట్టువడియె!
మింటఁ బెట్టని దీపమై ♦ మెలఁగె దద్ద!
యొకరిచేత గుఱ్ఱము —— కళ్లె ♦ మొకరిచేత! 52

శా. నానాభూతవిదాహకంబగు ప్రచం♦డ గ్రీష్మతాపంబున
న్పానీయం బిడుచుండ్రుగాదె! శ్రమ మై♦నన్ దెచ్చి సామాన్యులే
యౌనా? యింక భవాదృశుల్ ఘనులు! నే♦యందగ్గ దేమౌను? చు
క్కై రన్ బోయవె యున్నవైన! నిదియే♦నా ధర్మ? మబ్దప్రభూ!

శా. నీ పుణ్యం బని నేలపాలయి, యటన్ ♦ నిల్చుండఁగా లే, కధో
భూ పాతాళము లంటిపోయెడి జలం♦బుం దెచ్చి పానీయశా
లా పుణ్యస్థలి కుద్ధరించి పరమా♦హ్లాదంబు చేకూర్చు మా
వ్యాపారంబును జూచియైన ఘనుఁడా! ♦ వర్తింపరాదో యిఁకన్!

మ. పగ లంతంతకుఁ దగ్గి చండకరుఁడున్ ♦ బ్రఖ్యాతిగా మిత్రుఁడై
తగున ట్లీ వమృతంబు వోసి, తిటమీఁ♦దన్ బాధ లే దంచు న
మ్మగతో నుండ ఘనుండ! తాప మొకటన్♦మెండైన కాలాన నెం
తగ భీష్మించెదవోయి! యెవ్వరి నిఁకన్♦ నమ్మంగ నౌనో గదా! 55

మ. వలపుల్ వడ్డికిఁ బాఱఁగాఁ దగిన దాం♦పత్యంబులో మేఘుఁడా!
కలఁకల్ పుట్టఁగరాదు; నీ వొకటఁ జు♦క్కల్ చూడ, నీభార్య చం
చల యన్ పేరు వహించె; మీవలని వై♦షమ్యంబు లిట్లౌటఁగా
వలయున్ లోకములోనిజారిగతులున్ ♦ భంగంబులై పోయెఁగా!

ఉ. జనకునిపైకిఁ గత్తి గొని ♦ సాగుట ధర్మము గాదు చూడు! పా
వనకరుఁడైన సూర్యభగ♦వానుఁడు దివ్యకరంబులన్ నినున్
ఖనమిన దేహ మంట, నుప♦మింపఁగరాని మహేంద్రచాపమున్
గొని యెదిరించి నిల్తువా! ఘ♦నుండవు పో యెటువంటిచేఁతకేన్.

సీ. ఉన్నప్పటికి శూన్య ♦ మన్నను నాకాశ
మెట్టికోపంబుఁ జూ♦పెట్టఁ బోదు
త న్నాదరింపక ♦ యున్న మహాబలుం
డేయుపప్లవమును ♦ జేయఁబోఁడు
త న్నంటుపఱుపక ♦ యున్నచో శుచిదేవుఁ
డేయుపద్రవమును ♦ జేయఁ బోఁడు
కాలితోఁ దన్నినం ♦ గాని క్షమాదేవి
యే యనర్థంబును ♦ జేయఁబోదు
తే. సరసుఁడవు, చల్లఁబఱచెడి ♦ స్వామి వనుచుఁ
బొగడుకొలఁదిని మిన్నంది ♦ భూమిమీఁద
బఱటకును ముంచుచుండిరె ♦ కడిఁది తొట్రు
లేటికో చేయుదువు నీవు ♦ నీటిసామి ! 58

చ. బిరుదుల కేమి తక్కువలు ? ♦ విజ్ఞత చాలని మా కవీశ్వరుల్
వరుసగ జీవనప్రదుఁడు ♦ వారిదుఁ డంచు సమాసనంపుటీ
కరణమునందుఁ గూర్చిరది ♦ గన్గొని గర్జిలుచుందు వీవు; నే
బిరుదములైన నెప్పుడవి ♦ విల్వకు వచ్చునో చూడు తుంబుదా !

తే. మానసంబున నానంద♦మగ్న మగుచు
మైమఱపు గాంచు పరమహం♦సవ్రజంబుఁ
జెదరి పాఱుఁగఁ జేయు నీ♦చేత ఘనుఁడ !
స్వాస్థ్య మెటు లబ్బునయ్య ? యొ♦వ్వారికైన. 60

ఉ. దుష్కరమైన దేమి ? పలు♦తోయములన్ ఘనకార్యజాత మా
విష్కృతి సేయుచుందు వని ♦ పెద్దయు గర్జిలుచుందు; గాని యా
పుష్కలకీర్తి నిల్పుకొని ♦ పూజ్యత గాంచితె ? హెచ్చుతగ్గులన్
శుష్కిలుచున్న లోకమును ♦ జూచితె? చూచి చరించితే ? ఘనా!

చ. చెలిమికిఁ జిక్కి, లోఁబడి వి♦శేషముగా జరిగించు రాకపో
కలవలనన్ రగుల్కొలుపు ♦ గాలికి నాఁకటిమంట లేచి న
ల్వాలఁకుల నెల్లచోఁ బురము♦లన్ దహియించుచు నుండ నే
వలనునఁ జూచి యోర్చెదవు ? ♦ వారి నడంపకయే ఘనాఘనా !

శా. నీకన్నన్ మునుముందె మాగణకు ల♦న్వేషించి నీచర్యలన్,
సాకల్యంబుగ వ్రాసిపెట్టుదురు పం♦చాంగంబులన్; నీవునున్
సౌకర్యం బని వారివ్రాఁతలకు, తూ♦చా తప్పనీ వైతి; కా
నీ కష్టంబులఁ జూచి దిద్దుకొనువా ♦ రేరయ్య ? ధారాధరా! 63

క. ఒకలెక్కపద్దు నటు నిటు
గికురించిన నెవరు దాని♦కిటు కెఱుఁగుదు ? రిం
తకు మా దైవజ్ఞులు నే
రకపోయిరి; యిపుడు నిన్ను ♦ రాచిన నేమా ? 64

ఉ. వచ్చిననాఁటిప్రేమ చన♦వచ్చిననాఁటికి దక్కకుండఁ బై
పెచ్చుగఁ దిట్టి పంపుటకు ♦ వీ లగునట్లుగఁ జేసిపోవు; దే
తచ్చరితంబుఁ జూడ నుచి♦తజ్ఞత చాలినయట్లు లేదు; వై
యచ్చరయోగ మబ్బియు ఘ♦నా ! యుచితజ్ఞత లేకపోయెఁగా !

చ. విష మమృతంబు నీకు నొక ♦ పేరిటివే యగు; నందు భేద మ
న్విషయము లేదు; వేత్త వగు ♦ నీ కది చెల్లెడుఁగాక; మూఢమా
నుషజగమందుఁ జెల్లదు; ప♦నుల్ చెడునే నమృతంబె పోసినన్
విష మయి తోఁచుఁ; గానఁ గను♦పెట్టి మెలంగఁగదోయి వారిదా

క. అనవలసి యంటిఁ గానీ
నిను మించిన దాత గలఁడె? ♦ నీరదముఖ్యా!
కను గలిగి నడుచుకొనవలె
ననునదియే యిందు ముఖ్య ♦ మని యెంచు సుమీ! 6

తే. కాలవర్షము గురిసి ము♦క్కాఱు పండి
భోగభాగ్యాలతో జనుల్ ♦ పొదలుచుండఁ
గనులపండువుగాఁ జూచి ♦ జనులఁ బ్రోచి
మురిసిపోవచ్చుఁగద? నీవు ♦ మొయిలుతేఁడ! 6

మ. తగిన ట్లింత కొకండ వీ వుభయమ♦ధ్యస్థుండవై యుండఁబ
ట్టిగదా జీవజగత్తటం చొకటి పు♦ట్టెన్! నీవె లేకున్నచో
దిగిరా నేర్చునె జీవకోటి భువికిన్? ♦ దివ్యాబ్ద! యిట్లాటఁ
జగదుత్పత్తికి నీవ మూల మని ప్ర♦స్తావించె నామ్నాయము.

మ. ఘనవంశంబున జన్మ మందితివి, ప్ర♦ఖ్యాతంబుగాఁ బేరుతో
ఘనుఁడై పోయితి, వత్యుదారతను నీ♦కంటెన్ ఘనుం డెవ్వఁ?
వ్వని కబ్బెన్ సురసార్వభౌమపదసే♦వాభాగ్య మోమేఘ! యెం
తని వర్ణింపఁగనౌను నీఘనత? వా♦చాతీతమై యొప్పఁగన్. 7

మ. అమృతాత్ముండవు, జీవనప్రదుఁడ, వృ♦ద్ధ్యత్తాపసంహారి, వై
న మహేమయ్యెదు? తిట్లపా లగుదు వ♦న్యాయంబుగాఁ గాలదో
షము సంధింపఁగ నట్టు లిట్టు లగుచో; స♦న్మార్గ! యేమైన ధ
ర్మముకై పొల్పడువారి కిట్టిగతియే ♦ ప్రారబ్ధ మాచుండుఁగా! 76

—: ఇంద్ర :—

ఆ. ఏమి సేయలేని ♦ నామనస్సే యెంతొ
కరఁగిపోవుచున్న ♦ తరుణమందు
నీమనస్సు కరఁగి ♦ నీఱు గాదే యింద్ర!
వాడిపోవు పైరు♦వంకఁ గనవొ?

క. సొమ్మసిలు పైరు గని మే
ఘమ్ములఁ బంపంగరాదొ? ♦ ఘనవాహ! నీ
సొమ్మేమి పోవునయ్యా?
యిమ్మహి చల్లంగ నుండ♦నీయఁగరాదో?

క. చేకావలి సైదోడులు
నీ కగ్నియు ధన జలాధి♦నేతలు! నైసర్గ . .
లోకమున కన్న మిడవో
పాకారీ! యెంతబిరుదు ♦ వడసితివయ్యా?

చ. బుధ కవి చంద్రు లుండి, గురు♦పుంగవుఁ డుండి సమస్తబాధ్యత
విధులను జక్కదిద్ది నడి♦పించుచునుండ, కుజన్మ మందులం
దధమపదవ్యవస్థ లిడి ♦ యర్హాత సత్పథగామివై ప్రభా
సిద్ధి వయి వెల్గుచంద్రుఁడు గ్రహా♦నేత! యిట్టి దురవస్థ లేటికో? 8

మ. గ్రహచారంబు సరేని పట్టినది బం♦గారంబుగా సాగుఁ; ఆ
గ్రహచారస్థితి చాలిరానపుడు బం♦గారంబె మన్నయ్యెడిన్;
గ్రహరాజా! శుభయోగసంఘటనలే ♦ కల్పింతువా నే నవ
గ్రహదోషంబు పొసంగ నేల? యటు సా♦రస్యంబు వీక్షింపవో

మ. అనివార్య ప్రతికూల శూల పరిఘ ♦ వ్యాఘాత గండాదు లు
న్నను, ప్రీతి ధ్రువ సిద్ధ సాధ్య శివ పూ♦ర్ణ బ్రహ్మ సౌభాగ్య శో
భనవృద్ధుల్ గల శుభ్ర వజ్ర ధృతు లొ♦ప్పంగా సుయోగంబు లె
ల్లను నీపాలిటి వాట నెల్లశుభము ♦ లగ్గింపరాదో? రవీ! 86

మ. *సరి, మండేహులదాడి పెల్లడరి యేఁ♦చన్ సాగఁ దచ్ఛాంతికై
పరమార్థప్రతిపత్తి మంత్రయుతి న♦ప్రాప్తప్రహారంబుగా
వరుసన్ నీప్రభ వెల్గఁజేసెద; విట్టై ♦ వర్తిల్లు నీ వో ప్రభా
కర! నిర్మూలము సేయ వేటికి జగ♦త్తామప్రకామస్థితుల్? 87

మ. రవితేజస్స్ఫురణానురూపమునఁ బ♦ర్జన్యుండు వర్షించు నం,
చవలన్ బంటలు పండు నంచు శ్రుతివా♦క్యంబుంటచే నమ్మియుఁ
డ, విశేషించిన యెండవేఁడికిఁ గొలం♦తల్ గానరా; వింక మీ
దివిశేషంబులు దానికిం దగినరీ♦తిన్ గల్గ వేలా? రవీ! 88

* మండ + ఈహు లనియు. అప్రాప్తప్రహారంబుగాన్ - అప్ + ప్రాప్త - అనియు,
తా ఏతా ఆపో వజ్రీభూత్వా అని శ్రుతి.

శా. అస్తోకంబగు సత్ప్రచారమున దివ్యంబైన సారస్యపుం
ప్రస్తావం బెటులైన నీరసత మీఱఁ రాదుగా! అర్క! నీ
*హస్తాలంబన ముద్ధరించు ననఁగన్యావత్ప్రసక్తిన్ ఘన
ప్రస్తావంబె వికల్పమైనయెడఁ బ్రాప్యం బింక నెట్లబ్బెడున్?

మ. జలజాతాప్త! గురుండు మూలఁ బడియున్ జక్కన్ ధనుర్ధారి
నిలిచెన్ నీయిరుదండ, భార్గవుఁడునుండన్ భాతృరాజ్యాప్తుఁడై
చెలఁగెన్ సోమజుఁ డర్థలబ్ధినగుటన్ సింహాసనస్థుండవై
యిలలో వారిప్రయోజనంబులను హాయిన్ గూర్పవచ్చుంగదా

ఉ. నీ వుదయింపఁబట్టి మహనీయ! జగంబున కింతమాత్ర మే
దో వెనువెంట దిక్కు దెస దోఁచెను గాక, నిజోచితంబులౌ
దేవ పితృక్రియాదులను దీర్పఁగ నయ్యెడుఁగాక, లేనిచో
నేవరునన్ దమం బతిశయింపఁగ రూపఱి యుండుమోఁగదా!

ఉ. పుట్టిన గిట్టినన్ బరమమోదముగా నొకదిక్కు చూపువాఁ
డెట్టి మహామహుం డనుచు నెన్నవలెన్? దిననాథ! నీకెపో
అట్టిప్రతిష్ఠ దక్కెను; సమక్షము దప్పినవేళఁగూడ నీ
పెట్టిన దీపమేగద! ప్రవృత్తికిఁ దారకమై వెలింగెడున్!

---

* హస్తకార్తె. అనఁగన్ + యావత్ప్రసక్తిన్ అనియు, అనన్ + కన్యావత్ప్రసక్తి అనియు. హస్త చిత్రార్థం కన్యా. ప్ర + అప్యంబు = ఉదకముచే లభింప దగినది యనియు.

శా. 'అగ్నే రూప' యటంచు వేదము శ్రుతం బౌ; విశ్వభూతంబులున్
లగ్నం బైనవి యస్వరూపమునఁ; గల్గంబోవునే యింక ను
ద్విగ్నత్వంబు త్వదాప్తి యున్న? జగతిన్ వేధింప నీ కిచ్ఛయా
అగ్నిస్వామి! యవృష్టిదోష మన నెట్లో? నీవ చేపట్టినన్? 10

ఉ. వాసిగ గౌరవంపుటల వాటులు నేరిచి మంచిమంచి య
భ్యాసము లాత్మతారకము లంచుఁ బ్రియంపడియుండ నగ్నిహో
త్రా! సహియింపలేక పొగఁ ద్రావను నేర్పితి వౌర! యీ దు
భ్యాసము మాజనంబునకుఁ బట్టునె? నీ వటు ముట్టకుండినన్.

సీ. కుజనులసంగతుల్ కూడియుంటనె గదా?
ఖాండవవనమునే గాల్చివైచె!
ధర్మవిద్రోహుల దౌష్ట్యమ్ము గని కదా?
ఊరును బేరు లేకుండఁ జేసె!
శాంతనవప్రీతి జరుపనౌ నని కదా?
పాతాళగంగనే పైకిఁ దెచ్చె!
అర్థివారలను గా దనరా దనియె గదా?
వరకరుణ సుభద్రకరముఁ బూనె!

తే. సరసుఁడై యిట్లుగా ధనంజయుఁడు వెలసె?
నీవు నావేరివాఁడవై యేమి ఫలము?
చేసినది యేమి? యేదేని చేసియున్న
నవని కగచాట్లు రానేల? యగ్నిహోత్ర!

ఉ. కోణము నేలు స్వామి వను♦కొన్నను యోగము మంచిదై జగ
త్ప్రాణపదంబు గొంటి; విటు♦లయ్యును జీవన మిచ్చుదాతయు
ప్రాణము గొల్లగొట్టెదవు♦గా! యిటులై గద! ద్రిమ్మరీఁడవై
నాణెపురూపు లేక చెడి♦నావు ప్రభంజన! సోఁకుదయ్యవై. 107

ఉ. ఏది యెటున్న గాలిదొర!♦ యించుక చూఁడవు! ఘనుండవు నీలకం
ఠాదుల సంతసంపఱచి♦నంత ఘనుం! డటువంటివానిపై
నా దుడుకుల్ దుమారము? లి♦కైగద నిన్నలపాఁపజాతి యె
చ్చో దిగమ్రింగుటల్! ఘనుల♦జోలికిఁ బోయిన శ్రేయ మబ్బునే

చ. అనిలుఁడవైన నీకు నిల♦యం దధికార మొసంగినట్టివా
రిని ననఁబోలు! నిన్ను గది♦రించిన నేమగుఁ? బెత్తనంబు వ
చ్చినయెడ దానివాని కది♦ చెల్లును; భూములుఁ బుట్ట లేమి య
డని ప్రభులా? విచారణ యొ♦నర్చెడి స్వాములు? మాతరిశ్వుఁడ

—: కుబేర :—

సీ. మనుజధర్ముఁడు గదా!♦ మనుపఁడా? యని యన్న
నరవాహనుం డయి♦ పరగుచుండె
సార్వభౌమస్థితి♦ చక్కనొంగడ! యన్నఁ
దిరిపె మెత్తెడి మిత్రు♦ నరయఁడయ్యె

సీ. ఒకఁడు సురాధిపుం ♦ డొకఁ డంటరానివాఁ
డొకయిర్వు రిటువలె ♦ నుండువారు
ఒకఁడు ప్రాణముఁ దీయు, ♦ నొకఁడు నెత్తురు ద్రావు
నొకయిర్వు రీభంగి ♦ నొప్పువారు
ఒకఁడు జడస్వామి ♦ యొకఁడు సోఁకుడుదయ్య
మొకయిర్వు రీరీతి ♦ నొనరువారు
ఒకఁడు మానిసి నెక్కు ♦ నొకఁడు కాటికిఁ ద్రొక్కు
నొకయిర్వు రీగతి ♦ నొదవువారు
తే. తఱచి నాల్గుమూలలు కన్ను ♦ దెఱచి చూడ
ద్వంద్వపరిపాలనం బిట్లు ♦ తగులువడియె !
దిగ్విదిక్కుల స్వాము లీ♦తీరు గాఁగ
నెవరి కెవరిఁ జెప్పికొనవలె ♦ నవనిగోడు ? 11

—: దేవ :—

ఉ. రక్షణ కర్త్వమహా పరిక♦రంబు కరంబున బిగ్గఁ బట్టి దు
ర్భిక్షపు దేవలోకమున ♦ వేలుపుస్వాములు ద్రోహ మెంచి, స
ర్వక్షమ మైన మాక్షితిని ♦ బాములపా లొనరింపకున్న, దు
ర్భిక్ష మటన్న శబ్దము సు♦భిక్షజగంబునఁ బుట్టనేర్చునే ? 11

ఉ. తామె ప్రపంచ మేలుటకుఁ ♦ దాళుదు మం *చధికారులై ప్రజా
స్వామికమైన భూమికి శు♦భం బొడఁగూర్పక కాదె? దేవతా
స్వాములు గబ్బిలాల్గుడుల ♦ బంధితులై పడియుండి! రైన నే
దో మరియాదఁ జూపి మన ♦ సుంచి భజించు ప్రజన్ దలంచిరే!

సీ. ఒకఁడు కొంపలు గూల్చు ♦ నొకఁడు కొంపలు గాల్చు
నెవ్వరిదరిఁ జేర ♦ నేమి ఫలము ?
ఒకఁడు కొంపలు ముంచు ♦ నొకఁడు ప్రాణముఁ ద్రుంచు
నెవ్వని నమ్మిన ♦ నేమి గలదు ?
ఒకఁడు బిచ్చము నెత్తు ♦ నొకఁడు వేంద్రము నొత్తు
నెవ్వానిఁ గొల్చిన ♦ నేమి యబ్బు ?
ఒకఁడు నిశాచరుం ♦ డొకఁడుఁ డగోచరుం
డెవని సేవించిన ♦ నేమి యొదవు ?
తే. ఎవ్వరిని జూడఁబోయిన ♦ నేమి చెప్పఁ ?
బట్టు వట్టిన నట్టేటఁ ♦ బుట్టి ముంచు
స్వాములే యైరి!; యిటువంటి ♦ వారలంట!
జగము లన్నిటిఁ బ్రోచెడి ♦ స్వాములంట !! 116

ఉ. పస్తులు నిస్తు లుండి, పెను ♦ బాధలతోఁ దల మున్గుచుండి, ప్రా
ద్ధస్తము కుందుచుండి, కుము♦లారుచుఁ గూలుచునున్నవారి వ్య
త్యస్తపరిస్థితుల్ మనసుఁ ♦ దాఁకవ? తాఁకిన, నట్టివాని వి
ధ్వస్తము సేయుశక్తి కొఱఁ♦తంబడెనా? యిఁక నేమి దేవతల్ ?

* అధిక + ఆరు లనియు.

సీ. భువనమోహను మనో♦భవుని మాడ్చిన స్వామి
రుద్రుఁడా ? చేపట్టి ♦ ప్రోచువాఁడు !
శతమన్యువై సుర♦సామ్రాజ్య మొడిసిన
పాకారియొక్కొ ? కా♦పాడువాఁడు !
ఉన్నయీయామిరిగూడ ♦ నూడ్చివేసెడు చండ
భానుఁడా ? తాపంబు ♦ వాపువాఁడు !
భువనాధిపత్యంబు ♦ పొందియు ముంచువా
రికి నాయకుఁడ ? యుద్ధ♦రించువాఁడు !

తే. ఎవరిగతి వారిదేగాక ♦ యెంచిచూడ
నాదుకొనువారు లే; రట్టు ♦ లాశపడుట
ముల్లు దీసి కొఱ్ఱడఁచిన ♦ పోల్కి యగుట
నన్యులను బట్టుకొని ప్రాఁకు♦లాట తగదు. 118

ఉ. గట్టిగ నిల్చి కాతు మని ♦ కావక పోవుటఁ గాదె ? వేలుపుం
జెట్టులు తాళ్లు రప్పలయి, ♦ చెట్టులు చేమలు గుట్టలై మెటల్
పుట్టల మిట్టలందుఁ బడి♦పోయిరి ! పోవకయుందు రేమి ? చే
పట్టిన కార్యభారమును ♦ బాలనసేయ నుపేక్ష చేసినన్ ! 119

శా. నేతృత్వంబునఁ జాల దిట్ట లని య♦న్వేషించి మున్ బ్రహ్మ యే
దో తంటాల్పడి లోకపాలనమహో♦ద్యోగంబు చేకూర్పఁ, ద
ర్వాతన్ జక్కఁగ లోక మేలరయి; రీ♦పాపంబుచేఁ గానిచో
భూత ప్రేత పిశాచ రాక్షసులుగాఁ ♦ బుట్టంగ నేలా ? సురల్. 120

ఉ. మానవులైన నెట్లయిన ♦ మార్తురు, కూర్తురు, చేర్తు; రింత కే
మైనను దోఁడుదొంగ లయ్యి♦నందున దొంగకుఁ దేలు గుట్టిన
ట్లౌను; మహానుభావులు మ♦హామహిమాంచితు లన్న వేల్పులుఁ
దీనికె పాలుపడ్డ నిఁక ♦ దేనికి నేడ్వవలెన్ జగంబునన్? 12

ఉ. ఇంతగ మీకుఁ జెప్పవలె♦నే? సమయజ్ఞులు గాని మూఢులో
నంతటివారలా? శివశి♦వా! యటు లాడఁగరాదు; లోకవృ
త్తాంతము లాకళింపునకుఁ ♦ దాఁకెడి స్వాములె; కాని యింత కే
సంతన తప్పెనో యెఱుక ♦ చాలని మాంద్యము గప్పె మీయెడన్

సీ. మధుపానమత్తులో ♦ మలినాత్ములకునైన
నాతిథ్య మొసఁగు గా♦ర్హస్థ్యగరిమ
పక్షపాతము గల్గు ♦ పక్షులకైనను
నాశ్రయ మ్మొసఁగు నౌ♦దార్యవరిమ
మిత్రునేన్ సహియించి ♦ మిడుకనివారికేన్
సంతాప మార్చెడి ♦ సహనశక్తి
ఫలభంగ మొనరించు ♦ పలుగాకులనునైనఁ
గాచి ప్రోచు పరోప♦కారపరత

తే. ఆదిగా ధర్మసూక్ష్మముల్ ♦ స్వానుభూతిఁ
జాటి చెప్పెడి తరులతా♦జాతినైనఁ
జూచి నిజధర్మ నిర్వాహ ♦ సూక్ష్మములను
దెలిసి వర్తింపరాదొకో ♦ త్రిదశులార! 12

ఉ. బాడబుఁ డన్యతారణము ♦ ప్రామఁగ, నొడ్డధనంబు వట్టి, తుఁ
గూడిన వారి పాపమున♦కుఁ దగు నిష్కృతి చూచి చేసికోఁ
జూడక పొట్ట నించుకొను♦చుం గద! యింతకుఁ దా నధోగతిఁ
బాడయిపోయెఁ దేజ మది; ♦ పాపము! సింధుపతీ! యెఱుంగవే?

మ. మహితానంతపదప్రపత్తి గల స♦న్మార్గుండు శుద్ధాత్ముఁడు
స్వహితార్థాభినివేశుఁడౌ ఘనుఁడు తా ♦ నీవారిదానప్రతి
గ్రహముఁ జేకొని చంచలాత్ముఁడయి క♦ర్తవ్యమ్ములం దజ్ఞుఁడై
బహుజాడ్యంబున *నీతిబాధ లొనరిం♦పఁ సాగె సింధుప్రభూ!

సీ. త్యాగభోగంబులు ♦ దైవారఁగా నింత
జీవనాధారంబు ♦ వెలఁగుచుండ
సత్పాత్రదానంబు ♦ సార్థకంబుగ నింత
ఘనుల నారాధించు ♦ ఘనత గలిగె
బాడబసంతృప్తి ♦ పరమార్థముగ నింత
అమృత మస్తనుభాగ్య ♦ మమరియుండ
కోరి చేరినవారి ♦ కోర్కి మీఱఁగ నింత
రత్నరాసులయీవి ♦ రాణ మెఱసె
తే. గుర్తుగా లోకరక్షణ ♦ గుణము లెల్ల
ముద్రపడి నిల్చె నీలో స♦ముద్ర! నీకు
వశములే గద! భువనజీ♦వనము లెల్లఁ
గఱవు కాటకమ్ములు నేల ♦ గలుగవలయు? 13

* ఈతిబాధ లనియు, నీతిబాధ లనియు.

—: బ్రహ్మ :—

ఉ. సృష్టికి మూలకారణుఁడ ♦ వీవకదా! యిఁక దానిలోని యు
త్కృష్ట నికృష్ట సంగతుల ♦ కెల్లను గర్తవు నీవకాదె? ని
రుపమగాను సృష్టి యొక♦రూపునఁ జేసినఁ జేయవచ్చుఁగా;
కిష్టము లేదొ యేమొ! వెల♦యించితి వసంగతముల్ పితామహా!

ఉ. మంచిని యుంచి, చెడ్డ యను♦మాటనె పూర్తిగ సృష్టిలోఁ దొలం
గించినవాఁడు కాదని యొ♦గిం దల ద్రుంచెడివార లుందురే?
యెంచకపోయి తావిషయ♦మే; యదియే యొక టుండియున్న నూ
హించు విరించనా! జగతి ♦ నెంతటి పూజ్యత నీకుఁ గల్గునో!

—: సర్వేశ్వర :—

శా. నీదేవత్వము మా మనుష్యతయు రెం♦టిన్ బోల్చినన్ భేద మే
మో దీపింపదు; నీవు చేత నయి, మే♦మో చేతఁగా కుంటి మా
రా దౌర్భాగ్య మణంపలేక; బళి! స♦ర్వజ్ఞత్వ సర్వేశ్వర
త్వాదుల్ నీకొనఁగూడి యేమి ఫలమ♦య్యా యింక? సర్వేశ్వరా!

శా. నీకుం గల్గినశక్తి మాకుఁ గలదే♦నిన్ మేము నీరీతిగా
నాకుం బోకయు నంటకుండునటు సే♦యం జూతుమా? యింతకున్
లోకంబందున నంటుకొన్న చెడుగుల్ ♦ వోకార్చి యత్యుత్తమ
ప్రాకట్యంబుగ మంచి యొండె నెలకొ♦ల్పన్ జూడమా యీశ్వరా!

—: నవనాయక :—

మ. ప్రతియంశంబు గుణించిరన్ గ్రహములారా! చిత్ర మన్పించు! మీ
గతులా? వక్రగతుల్! పరస్పర విలోక స్నేహ శత్రుత్వ సం
గతులా? లోకవిరుద్ధముల్! పయిని మీ కర్తవ్యమా? లోకసం
తతిఁ బాలించుట! యింక నెట్లు సుఖముం గన్ నేర్చు మీ యేల్బడిన్

ఉ. మానితమైన ధర్మము క్రమంబుగ నశ్లెను, నీతి దప్పె, ని
ష్ఠానియమంబు లూడె, జవసత్వము లాఱెను, స్వేచ్ఛ మీఱె; ః
ట్లౌ నిఖిలంబునున్ గ్రహములార! యయోమయమయ్యె;నింతకున్
మీ నవనాయకత్వమున మేల్మిటు చేకుఱె; నే మనన్ వలెన్? 141

మ. భయభక్తుల్ తఱుగైన, స్వేచ్ఛయని,వ్యాపారంబు సర్వం*బయో
మయమార్గంబును బట్టిపోయినది; క్షేమస్థైర్యముల్ పంట లుం
డియుఁ బాడైనవి; పచ్చికాటకము పీడింపంగ సాగెన్; దయా
మయు లన్ స్వాము లెవార లేని యిడుమల్ మాన్పింపరై రేలొకో!

మ. నియమాచారము లుజ్జగించి యెవరేనిన్ ‡మేలు మే లంచయో
మయమార్గంబునఁ బోవువారె యయి; రీమాడ్కిన్ బ్రవర్తిల్లఁబ
ట్టియుగా! లోకము వ్యాకులంపడుచుఁ దిం డిన్ దీర్ఘమున్ గాన కెం
తయు గోడాడెను! నింకమీఁదయిన సన్మార్గుల్ విచారింతురో!

---

* అయోమయమార్గము = ఇనుపదారి యనియు.

‡ మేలు మేలు = మెయిల్ ట్రెయిన్ అనియు.

మ. కలికాలం బిది, కాననే యిటువలెన్ ♦ గాలంబులన్ గాని యెం
డులనైనన్ మును ధర్మకాలమున నీ♦దుర్భిక్షదౌర్భాగ్యముల్
గలవే? యందురయేని, వట్టి దది; యే♦కాలంబునం దేని పీ
రలెగా! పాలకు? లెట్టు లుండ విఁక వీ♦రక్షామసంక్షోభముల్!

సీ. మున్ను విశ్వామిత్ర♦మునిచేతఁ గుక్కమాం
సమును దిన్పించిన ♦ సమయ మేది?
పచ్చికాటకము దీ♦ర్ఘంగ నాఋష్యశృం
గముని నర్చించిన ♦ కాల మేది?
దుర్భిక్షవేధ స♦త్త్రస్తుఁడైన వి
ప్రోత్తముఁ డుండిన ♦ యుగ మదేది?
క్షామపీడిత మౌని♦గణమును గౌతముఁ
డాదరించిన కాల ♦ మద్ది యేది?

తే. ఊరకుండక యనుకొంట ♦ యొకటె గాని
యెప్పుడైనను గ్రహచార ♦ మిదియగాదె?
కలియుగంబైన మఱియొక్క ♦ కాలమైన
వక్రగతులను దీర్ప నె♦వ్వారితరము? 145

మ. గ్రహయోగంబున *నగ్రవర్ణులయి చ♦క్రన్ వెల్గి, సత్కార్యని
ర్వాహణప్రక్రియలన్ సురాసుర గురు♦త్వం బంది కూడన్ మహా
మహులౌ మిత్రుఁడు కూడి రాఁగనెయటన్♦మౌఢ్యంబుపాలౌచుఁదా
మహాహా!యొక్క శుభంబుసేయరఁటయ♦య్యాచార్యు!లింకేమగున్?

* అగ్రవర్ణులు = మంచికాంతి గలవా రనియు, బ్రాహ్మణగ్రహము లనియు.

—: ప్రభు :—

మ. ప్రభుధర్మంబు క్షమల్ ప్రజల్ ప్రజలధర్మం బొక్కటిం జక్కఁగా
నుభయుల్ పాలనఁ జేసికోఁగలిగి తా మున్నప్పు డేమాత్రమే
నభయారోగ్య సుఖాయు రర్థముల దైన్యం బుండునే? యింత కా
శుభయోగంబు ఘటిల్లదాయె! ; నిఁక సంక్షోభంబు లేకుండునే?

ఉ. వేరులుపోలెఁ దొల్దొలుత శ్వేతముఖుల్ మెలమెల్లఁ దూఱి భూ
సారము నెల్ల నుంజుకొను స్వాములుగా గడిదేర, వారివ్యా
పారమె నేర్చి మాప్రజలు పాపము పుణ్యము లేక పూర్తిగా
మారి; రిట్లె గదా! ప్రభుల మాదిరియే ప్రజ లన్న నానుడుల్.

ఉ. కాలముమీఁదఁ ద్రోసి, వెనుకన్ దెరచాటున నాటలాడుచున్
జాలును మూల లేని వరుసన్ బరుసంబుగ నిచ్చవచ్చిన
ట్లేలుబడిన్ దెమల్చి, చెవరేమయినన్ గను లెత్తి చూడఁ బ్రా
ల్మాలెడిస్వాము లేర్పడ — సమస్తము వ్యస్తము గాక యేమగున్?

మ. మనుమార్గంబును దప్పఁ దీసి, యనువౌ మార్గాన నంబేద ల
నొక్కనున *ట్లక్కడ జాతిపద్ధతుల నున్మూలంబు గావించి శా
సనముల్ సేయు ప్రజాధికారు లిల నేర్చన్ గంచెయే చేనుమే
సినయ ట్లయ్యెడుఁగాక, యె ట్లగుఁ బ్రజాక్షేమంబు దేశంబునన్ ?

* అక్కడ + జాతిపద్ధతులన్ + ఉన్మూలంబు గావించి అనియు, ఆ + కడజాతిపద్ధతులను + మూలంబు గావించి యనియు. ప్రజా + అధిక + అరులు అనియు.

శా. సంధ్యా స్నాన జపాగ్నిహోత్రముల నుత్సర్జించి, నానాటఁ గ
ర్వాంధ్యం బొప్పఁగ వేదశాస్త్రముల మర్యాదల్ దిగంద్రావి, దు
స్సాంధ్యాలోచనులై ద్విజాతులు యథేచ్ఛాచారులై వర్తిలన్
వంధ్యత్వం బొనఁగూడ కేమగును దివ్యన్మంత్రతంత్రాళికిన్? 156

మ. అనుశోస్నన్ బరమాద్భుతంబులగు చర్యల్ గాననౌచుండు మా
జనసంఘంబున!; నేఁడు చూడుఁడు! గుణాజ్ఞత్వంబుతో మున్ను; చే
సినవా రుండిరొ లేరొ! యిప్పుడొ యవిచ్ఛిన్నాగ్నిహోత్రాలు పె
ట్టినవా రెందఱొ! సాక్ష్య మిందులకు బీడీల్ సిగరెట్లేసుఁడీ! 157

శా. ఏనాఁడో యొకతప్పు చేసెనని గాదే? మాఘునుల్ బ్రహ్మకెం
దేనిన్ బూజలు సున్నచుట్టి; రది యట్లే యుండ, నేస్వామికే
నీనాఁ డొక్కరుఁ బూజసేయమికిఁ దప్పేమైన లేకున్నచోఁ
ధ్యానావాహన పూజనాదులను మానన్ గారణం బేమగున్?

శా. పాతిత్యస్థితిపాలు కాఁదగని మాస్వాముల్ స్వధర్మచ్యుతిన్
జాతిభ్రంశము నొంది పాడయిరి; స్వచ్ఛందప్రవృత్తిన్ విహ
ర్యాతీతాక్రమచర్యలన్ బడిరి; జిహ్వాగుహ్య సంతృప్తికై
నీతిన్ నేమము నుజ్జగించిరి! యిఁకన్ శ్రేయం బెటుల్ చేకుఱున్?

ఉ. మాదురదృష్టమే మను సమస్తవిధంబులఁ గూల్చె; వేదికా
వేదము లుద్వసించిన ప్రవీణులు బాపనస్వాములైరి!; మ
ర్యాదకుఁ దావులేని విషయంబులకున్ దెగ సాహసించి!; తీ
వోదిదిఁ గాలఁబడ్డపుడు మంచిగతుల్ జగమందుఁ గల్గునే? 160

—; కాలము :—

ఆ. వావివరుస లేక ♦ వర్తించు ప్రజ లింకఁ
బూర్తి ప్రబలకున్న ♦ పూర్వమందె
కలివి తెచ్చిపెట్టి ♦ కాటించె దేలొకో
కాలపురుష! నీకుఁ ♦ క్రమము లేద? 164

క. తనకాంత తనకె కాపుర
మొనరింపఁగవలయు ననుట ♦ యుక్త మొకటని హే
ళనఁ జేసి ముఱియుకాలము
కనవచ్చెనె? కలివు లిట్లు ♦ కాలఁబడంగన్! 165

చ. పదుగురియావనంబు ఫల ♦ వంతము చేసిన ముద్దరాండ్రు న
ల్వదియవయేటఁ గ్రొంజిఱుత ♦ ప్రాయములోపలఁ బెండ్లికూఁతులై
వదలినదాఁక నేలుకొను ♦ భర్తల గుత్తకుఁ దీసికొన్ శుభా
స్పదమగు పెండ్లివేడుకలు ♦ వచ్చినవా మఱి? క్షామ మేర్పడన్!

మ. మనబిడ్డల్ మనవారలున్ మన మనన్ ♦ మర్యాదగానున్న యీ
మన శబ్దంబును భార్యతోఁ గలిపి సం ♦ భాషింప నెందుండి వ
చ్చెనొ యీవేశము! కర్తినూర్చ్చ; నిటులౌ ♦ చున్ మానమర్యాద లుం
డిన యీభారతభూమిపై నదియు మ ♦ న్నింపంబడన్ లేదుగా! 167

తే. ఒడిసి క్రొంగ్రొత్త తలపోఁత ♦ లూరుచుండ
గాడి మాటినపశువుపొం ♦ కంబు గాఁగఁ
జేయి మాటినకాలఁదిని ♦ శ్రేష్ఠ మనుచు
స్త్రీల వరియించుకాలంబు ♦ చెల్లె నేమి? 168

—: సంప్రతిపత్తి :—

శా. మీకున్ మాకును దప్పు దెప్పుటకిఁ; దాల్మిన్ బూని మీమాపనుల్
సౌకర్యంబుగఁ జక్కదిద్దుకొనుచున్ సౌఖ్యంబుగా నుండ; మే
లా? కార్పణ్యము? కల్మషాశయము?; లన్యోన్యస్యంబుగానున్న చో
లోకక్షేమము రెండుపక్షములఁ జెల్లున్ జూడుఁడా! దేవతల్. 173

శా. మీమర్యాదలు మీరు చూచుకొనుచున్ మీరుండుఁ,
డా మీఁదటన్
మామర్యాదలు మాకు దక్కునటు సంభావింపుఁ; డింతేకదా
మీమాచుట్టఱికంబు?; లిందుకొఱకై మి మ్మేను సాధించుటల్,
మామీఁదన్ బడి మీరు కూర్కువడుటల్ మర్యాద గాఁబోదుసూ!

చ. స్తిమితత గల్గి యొండొరుల సేమము లారసికొంచు, సౌమన
స్యము గలవారమై, పోరుపు లన్నవి లేక సుఖానఁ గూడియుం
దము మన మింతనుండియయినన్, సురలార! నిజాన కట్టుబం
ధము కలదేగదా మనకు! నాఁటికి నేఁటికి ముందునాఁటికిన్! 175

చ. తెలిపితి నింతదూరము విధిప్రతిషేధము లేర్పఱించి, యం
దులఁ గల ధర్మసూక్ష్మములనున్ వివరించితిఁ; జేతనైనయ
ట్టులు గుణ మున్నవట్టుల నుడుల్ పొడిగించితి, నిష్ఠురోక్తులుఁగా
బలుకక తప్పదాయె నని వార్యముగా మది నొచ్చియుండుటన్.

చ. అనువుగ మీరు మేము పర♦మా ప్రతిం దండ్రులు బిడ్డలట్లు భా
వనపడి యేరిబాధ్యతలు ♦ వారలు దీర్చుచు, మీకు మేము మా
కును మఱి మీరునై కలుపు♦కోలుదనంబున నెంతొ హాయిగా
మనుదము వేల్పులార! కడ♦మాటగఁ జెప్పితి వేయు నేటికిన్? 177

శా. నానాక్లేశము లొంది కుందునటులన్ ♦ గా 'నుద్ధరే దాత్మనా
త్మాన' మ్మన్ పరమార్థ మెంచి, నిజధ♦ర్మంబందుఁ గాలూని, యె
ట్లైనన్ పాలకజాతి మేల్కొలిపి యా ♦త్మార్థంబులం దీర్చికొం
చానందంబున నుండుఁ డింకఁ బ్రజలా♦రా! నిర్విచారంబుగన్. 178

శా. స్వచ్ఛందంబగు నేల్బడిన్ వదలి, వి♦శ్వశ్రేయమున్ గోరి, భా
స్వచ్ఛ్రీయపథంబునన్ నిలిచి దు♦ష్టధ్వంస శిష్టావనా
వచ్ఛిన్నంబగు రాజధర్మమును సం♦భావించి పాలింపుఁడే
కచ్ఛత్రంబుగ రాజులార ! యిఁక యో♦గక్షేమముల్ గూడఁగన్.

ఉ. ఏలిక కంటునంద్రుడు తన♦యేల్బడిలో నెట నెవ్వ రేమి పా
పా లొనరించినన్; గనుకఁ ♦ బాపముపాలయి పోవకుండ భూ
పాలుఁడు కన్ను గల్గి పరి♦పాలన సేయఁగఁబోలుఁ గాన నో
యేలికలార ! దుర్గతుల ♦ కెందును దా విడకుండఁ జూడుఁడా! 180

శా. దుర్మార్గంబుల పొంతఁ బోక, విహిత♦ద్రోహంబు గావింప, కు
చ్చైర్మర్యాదల నుజ్జగింపక, అవి♦జ్ఞానంబుపాల్గాక, స
త్కర్మానుష్ఠితిచే స్వధర్మము నికన్ ♦ గాపాడుఁ; డేనాఁటికేన్
'ధర్మో రక్షతి రక్షితః' యనెడి సూ♦క్తం బుండనే యుండెగా!

శా. చాతుర్వర్ణ్యము సృష్టిసిద్ధ; మెట సంజ్ఞామాత్రభేదంబ కా
నీ తత్తద్గుణ ధర్మ కర్మముల మాన్పేమేని లే, దుండఁబోఁ;
దేతత్తత్త్వ మెఱుంగలేక యెవరో యేమో భ్రమంపెట్ట లో
కాతీతంబగు దీని కట్టె లయ వేయం బోకుఁడీ మానవుల్! 182

మ. మనలోఁ గార్యవిచక్షణత్వ మగుపింపన్ దక్షుఁడౌ వారు ముం
దునకున్ వచ్చి, రవంత తోడిజనులందున్ దాని నెక్కొల్పి, యా
ర్తినిరాసం బొనరింపఁగావలె 'స్వయం తీర్ణః పరాం స్తారయే'
త్తను నాదేశము లోకసంగ్రహవిధానార్థంబెగా యేర్పడెన్! 183

ఉ. సవ్యపథాన నిల్చి, యపసవ్యపుఁద్రోవలఁ ద్రొక్కఁబోక శ్రో
తవ్యములైన సంగతులఁ దత్పరతన్ జెవి యొగ్గి వించు, జ్ఞా
తవ్యములందు బుద్ధి నిడి, ధర్మ మెఱింగి సదస్యులార! క
ర్తవ్యము లెల్లఁ దీర్పఁగఁ బరామరిసింపుఁడు; చూత మావలన్.

ఓం తత్సత్.



జానకీరాం ప్రెస్, తెనాలి.

కవితాసామ్రాజ్యమున వెలువడు గ్రంథములు.

## మద్దులపల్లి వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి కృతములు

ముద్రితములు

౧. సత్యనారాయణ మాహాత్మ్యము. 1-0-0

ఆయిదాశ్వాసముల పద్యకావ్యము.

౨. దైవప్రార్థన - సుభాషితములు. 0-8-0

అనుక్షణము పఠింపఁదగిన భక్తి జ్ఞాన వైరాగ్య నీతి పద్యములు 3 వందలకు పైగా. (నాల్గవ ముద్రణము)

3. కుక్కల మొఱ. 0-2-0

కటికి హృదయమును గూడఁ గరఁగించు పద్యములు.

౪. అమృత సందేశము. 0-12-0

ప్రతిపద్య రమణీయము.

౫. చేతావని ఖండనము. 0-8-0

1948 ఆగష్టు 1 వ తేదితో కలియుగము పోయి కృతయుగము వచ్చుచున్న దని దుష్ప్రచారము చేసిన చేతావని అను గ్రంథమునకు ఖండనగ్రంథము. అనేక సందేహములను సప్రమాణముగాఁ దీర్చునది. 144 పుటలు. వచనము.

౬. బ్రహ్మస్వామి జీవితము. 0-8-0

1890 లో సిద్ధిపొందిన యొక సిద్ధపురుషుని అద్భుత చర్యలు. 76 పుటలు. వచనము.

౭. ఇంద్రగంటి శేషావధానులవారి చరిత్ర. వచనము. 0-4-0

౮. చమత్కార కవిత్వము. 2-0-0

కీ. శే. శతావధాని గాడేపల్లి వీరరాఘవశాస్త్రిగారి చమత్కార కవితా ఘట్టములు. ప్రతివిషయ రమణీయము. 182 పుటలు.

౯. ధ్రువ చరిత్ర 1-0-0

182

గాడేపల్లి వీరరాఘవ శాస్త్రిగారిది. పద్యకావ్యము

## ముద్రణకు సిద్ధముగా నున్నవి.

౧౦. భక్త పోతరాజీయము.

భాగవత [illegible]ని చరిత్ర. 5 అంకముల నాటకము.

౧౧. త్యాగరాజు.

త్యాగరాజ చరిత్ర. 5 అంకముల నాటకము.

౧౨. వినాయక జనన శ్యమంతకోపాఖ్యాన నాటకము.

౧౩. పెండ్లి రాయబారము.

సీతారాముల పెండ్లి యెదుర్కోలు. పద్యములు.

౧౪. కవితా వినోదము. పద్యములు.

౧౫. అద్భుతచర్యలు. వచనము.

౧౬. కలియుగ దానకర్ణ బుడ్డా వెంగలరెడ్డి చరిత్ర

౧౭. గోకర్ణం. రామాభొట్లవారి చరిత్ర.

ఇత్యాదులు.

అడ్రస్ : కవితా సామ్రాజ్యము,
నంద్యాల.